యథాశక్తిగ శని గురుగ్రహములకు జపాభిషేకము చేయించుటవలను గురువార నియమము వలనను వ్యాపారాభివృద్ధి, మనోస్థిమితము కల్గును. మృగశిరవారు పగడము, ఆర్ద్రవారు గోమేధికము ధరించుటవలన యత్నకార్యసిద్ధి, కళత్ర సౌఖ్య ఆరోగ్యములుకల్గును, వివాహాది శుభకార్యములు, గృహ నిర్మాణములు వ్యాపారలాభములు కల్గును, చిరకాలమునుండి స్తంభించినపనులు లావాదేవీలు ఒకదారికి రాగలవు. వ్యవసాయదారులు ఇబ్బందులు మీద ఒకదారికిరాగలరు. జాయింటువ్యాపార, వ్యవసాయము లుండుట మంచిది,

1,4,5,6,9 తేదీలు సంఖ్యలు, ఆది, సోమ మంగళ శనివారములు యోగప్రదములు, చంద్ర శేఖరుని, శ్రీమహావిష్ణువును ధ్యానించుటవలన దైవస్తోత్రములు పఠించుటవలన అవమానములు తగ్గి తగిన వ్యవహారజ్ఞానము, నరముల బలము, వ్యాపార లాభములు కల్గును.

## కర్కాటకము

(పున 4, పుష్యమి ఆశ్లేష నక్షత్రములు)

ఆదా: 8 వ్యయం: 11 రాజ: 3 అవ: 3

ఈ సంవత్సరమంతము రాహువు 10 ట, కేతువు 4 ట తామ్రమూర్తులు, శని మే 31 వరకు 5 ట రజితమూర్తి. తరువాత సెప్టెంబరు 18 వరకు 4 ట లోహమూర్తి తదుపరి సం॥ర మంతయు 5 ట తామ్రమూర్తి, గురుడు జనవరి 25 వరకు 7 ట రజితమూర్తి, తదుపరి సంవత్సరాంతయు 8 ట సువర్ణ మూర్తి.

ఈ రాశివారికి ఈ సం॥రమంతయు మిశ్రమయోగముగ నుండును. మరియు మిత్రత్వము అను కూలము, జాయింటు వ్యాపారములవసరములేదు, జూన్ జూలై, అగస్టు మాసములు శని అర్ధాష్టమమునందు ప్రతిబంధకములు, అధికారమార్పులు భూమార్పులు కల్గును. శ్రమ అధికము, ఋణములుచేయవలసివచ్చి నను నివారించుకొనగల్గుదురు. జాయింటుదారులకు 1,4,5,8,10,12 మాసములు యోగములు, మిర్చి, ఇనుము, అపరములు, బెల్లము, నువ్వులు వ్యాపారులు శ్రమ, మెలకువచూపిన అధికలబ్ధిని పొందగలరు. సం॥ర మధ్యకాలమున తగిన శాంతి, ఓర్మిగ అత్యంత జాగ్రత్త వహించవలసిన సమయము, మొత్తము మీద ఈ రాశివారు ఊహించని మార్పులు, లాభములు పొందుదురు.

విద్యార్థులు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులౌదురు కళాశాల వ్యవహారములు హానివి కల్గించును. ఆదాయమునకుమించిన ఖర్చులు ఎదురగుచుండును. ఎంత తెలివిగలవారయినను జాగ్రత్తవహించుట మంచిది. రాజకీయ, కంట్రాక్టులవారికి యోగసమయము. వివాహాది శుభకార్యములు వ్యాపార భూ గృహ లాభములు సంవత్సర ఉత్తరార్థమున కలసివచ్చును. ధనియాలు, పసుపు, కుంకుళ్ళు, కొబ్బరి, పేపరు, కూరగాయలు వర్తకము పనివారికి లాభదాయకము.

జూలై, అగస్టుమాసములందు కళత్ర అనారోగ్య, అధికారమార్పులు తట్టుకొనవలసివచ్చును. ప్రతి పనియందు శ్రమ, ఆరోగ్యము, త్రిప్పట, చికాకులు కల్గినను ఒకదారికి వచ్చెదరు. మొదటవంట యోగదాయకము.

పునర్వసువారు పుష్యరాగము, నీలము, ఆశ్లేషవారు పచ్చరాయి ఉంగరమునందు ధరించుట వలన శతృజయము, వ్యవహార లాభములు, మనోధైర్యము కల్గివుందురు. వ్యాపారలాభములు, స్థాన యోగములు కల్గును.

శ్రీ వెంకటేశ్వర ధ్యానము, గురుస్తోత్రములు, సుబ్రహ్మణ్య స్తోత్రములు చేయుటవలనను, మంగళవారనియమముచేయుటవలనను అధికారవాహన భూగృహ శుభకార్యాదులు వ్యాపారలాభములు కలసి వచ్చును. ఉంగరమునందు ముత్యము లేక పగడము ధరించుటవలన రాజపూజ్యతగల్గి ఆదాయముకల్గి వుందురు.

1,2,4,5,6,8 తేదీలు, సంఖ్యలు, ఆది సోమ, మంగళ శుక్రవారములతో కలసివచ్చిన మరింత శుభప్రదములు, మొత్తముమీద ఈ రాశివారికి 4 ట 3 వంతులు యోగదాయకము.

## సింహరాశి

(మఘ. పూ ఫ ఉఫ 1 పాదము)

ఆదా: 11 వ్య: 5 రాజ: 6 అవ: 3

ఈ రాశివారికి సంవత్సరమంతయు రాహువు భాగ్యమందు, కేతువు 3 ట రజితమూర్తులు, గురుడు జనవరి 25 వరకు 6 ట సువర్ణమూర్తి తదుపరి సం॥ అంతయు 7 ట లోహమూర్తి, శని మే 31 వరకు 4 ట లోహమూర్తి, మే 31 నుండి సెప్టెంబరు 16 వరకు 3 ట తామ్రమూర్తి, తదాది సం॥రాంతము 4 ట లోహమూర్తి.

మఘా నక్షత్రమువారు సం॥రాది నుండి మే 31 వరకు ప్రతిపనియందు శ్రద్ధకల్గి వుండవలెను. పూ-ఫ. నక్షత్రమువారు 6,7,8 మాసములు మెలకువ చూపవలెను. ఉత్తర 1 వ పాదము వారికి 4,7,12 మాసములు మంచివికావు. మొత్తముమీద ఈ రాశివారికి పట్టుదల, ధైర్యము, స్థిమితము, పలుకుబడి బాగుండును.

సినీ, వైద్య న్యాయవాద కళాకారులకు ఈ సం॥రము పైమాసములుకాక ఇతర మాసములు మంచిది. ఇంజనీరింగు, కలప, ఫ్యాన్సీ, పేపరు, యంత్ర సమింధవ్యాపారులకు 3 ట రెండువంతుల ఫలితముచేకూరును. అపరము, బెల్లము, పసుపు, వ్యవసాయ వర్తకమందలి వారికి విల్వాదారులకు యోగము.

అధికారులు, ఉద్యోగులు ఆకస్మిక మార్పులు ఎదుర్కొనవలసివచ్చును. స్థానచలనములు అప్రయత్నముగ కల్గుచుండును. విద్యార్థులు హెచ్చు శ్రద్ధమీదగానీ ఉత్తీర్ణత నొందలేరు అంగ్లము, గణితము శ్రద్ధచూపవలెను. తీర్థయాత్రలు పుణ్యక్షేత్ర సందర్శనము చేయుదురు, రాజకీయముయోగము, భూ గృహ మార్పులు ఆలస్యముమీద కలసివచ్చును. వివాహాది శుభకార్యములు అప్రయత్నములుగ కలసివచ్చును.

మఘానక్షత్రమువారు వైఢూర్యము, పూర్వఫల్గునీనక్షత్రము వారు దైమండు రాయి, ఉఫ నక్షత్రమువారు ఎరుపు రంగు గలరాళ్ళు ఉంగరమునందు ధరించుటవలన మనశ్శాంతి, ఋణవిముక్తి, బుద్ధిబలము కల్గి ఆరోగ్యము కల్గివుందురు. సూర్యనమస్కారములు, శనిగురు జపాభిషేకములు జరుపుట వలవను నేత్రరోగములు తగ్గి వ్యవహారజయములు కల్గివుందురు. సుబ్రహ్మణ్యస్తోత్రములు మంచివి.
1,2,5,6,9 తేదీలు సంఖ్యలు, ఆది, మంగళ, బుధ, శుక్రవారములు అదృష్టప్రదములు.

## కన్యారాశి

(ఉత్తర 2,3,4 హస్త చిత్ర 1,2 పాదములు)

ఆదా: 14 వ్యయం: 11 రాజ: 2 అవ: 6

సంవత్సరాది నుండి జన 25 వరకు గురుడు 5 ట లోహమూర్తి తదావత్సరము 6 ట సువర్ణమూర్తి, సంవత్సరమంతయు రాహువు 8 ట కేతువు 2 ట లోహమూర్తులు సంవత్సరాది నుండి మే 31 వరకు 3 ట శని తామ్రమూర్తి, తరువాత సెప్టెం 16 వరకు 2 ట రజితమూర్తి, తదా వత్సరము 3 ట సువర్ణమూర్తి.

కన్యారాశి వారికి తృతీయ శని ధైర్యము వ్యాపారము, లాభము, కుటుంబవృద్ధి ధనలాభము, మొదలగు ఫలితములు కల్గుచుండును. జూలై, ఆగ, సెప్టెంబరు, మాసములు కుటుంబరీత్యా నేత్రరీత్యా, ధనరీత్యా చికాకులు మతిస్థిమితము మొగలగు ఈతిబాధలు కలుగుచుండును.

4, 7, 8, 12, 1 మాసములు ఈ రాశివారికి ఫలితములు సామాన్యములు వైద్యులు, గణిత వేత్తలు, న్యాయవాదులు, చింతపండు, సిమెంటు, ఎరువుల వ్యాపారులకు ఈ సంవత్సరము 90 శాతము ఫలితములు బాగుండును. గౌరవాభిమానముల కొరకు పాటు పడెదరు. యాత్ర, తైల, అపర, వ్యాపారుల పై మాసములు కాక ఇతర మాసములు బాగా ఫలితములుండును. పెట్టుబడిదారులు పెట్టుబడులు తగ్గించి వ్యాపారములు చేయుట మంచిది. ఆదాయగౌరవములకు లోటురాదు. లావాదేవీలు అగ, సెప్టెంబరు మాసములందనుకూలములు.

విద్యార్థులకు విద్యాభివృద్ధి లేక వ్యవహార జ్ఞానమును ఉన్నతిని విలిపివేయును. ఆర్థికశక్తి ఉపయోగించవలెను. ఉద్యోగులు, అధికారులు, వేదాంత జ్యోతిష మందలివారు ప్రత్తి, నూలు, ఇనుము శాస్త్రములవారికి ఈ సంవత్సరము మంచి ఫలితములు కలుగును. భూగృహాది మార్పులు సెప్టెం 18 తరువాత భూమార్పులు మే, అగ, సెప్టెం, డిశంబరు మాసములయందు కలుగును.

వివాహాది శుభకార్యములు సం॥ర అద్యంతములందు కలసివచ్చాను. అకాల భోజనములు, స్థానాంతరములు (దూరప్రయాణములు) తప్పవిసరి. వ్యవసాయధారులు సస్యబాధలు, ఇబ్బందులకు లోనవవలసి వచ్చినను ఫలితములుపయోగములు మొత్తముమీద ఈ రాశివారికి సం॥రము 8 ట 2 వంతులు యోగము.

ఉత్తరఫల్గునీ నక్షత్రము వారు ఎరుపురంగు, హస్తానక్షత్రమువారు ముత్యము, చిత్రవారు పగడము ధరించుట వలన యత్నకార్యసిద్ధి అభీష్టసిద్ధి పొందుటయు) ఆరోగ్యముగల్గి ధనలాభము కల్గి వ్యవహార జ్ఞానమును నేర్పును పొందెదరు.

గోమేధికము, గౌరీపూజలు, గురు రాహువులకు జపములుగాంతురు రుద్రాభిషేకములు జరుపుట వలన మనోధైర్యము, వ్యాపారానుకూలత వ్యవసాయలాభము కలసివచ్చును.

**2, 3, 4, 6, 7, 8 తేదిలు సోమ, మంగళ. శుక్ర, శనివారములు కలిసిన మరింత యోగప్రదములు.**

## తులారాశి

(చిత్ర 3, 4, స్వాతి విశాఖ 1, 2, 3 పాదములు)

ఆదా : 11 వ్యయం : 14 రాజ పూ : 5 అవ : 6

ఈ రాశివారికి రాహువు సం॥ర మంతయు 7ట కేతువు జన్మమందు తామ్రమూర్తులు. గురుడు జన 25 వరకు 4 ట, తదాది 5 ట సువర్ణ, తామ్రమూర్తులు. శని మే 31 వరకు 2 ట రజితమూర్తి తదాది సెప్టెం 18 వరకు 1 ట సువర్ణమూర్తి తదాది సం॥రము అంతయు 2 ట లోహమూర్తి.

తులారాశివారికి ఈ సం॥రము యోగప్రదము 7, 8, 9, 11 మాసములు యోగించవు. ఆదాయమునకు మించిన ఖర్చులు ఎదురగుచుండును. అధికారులు, వ్యాపారులు, ప్రభుత్వవత్తిడులకు ఇతరత్ర ఆకస్మిక మార్పులు, ఆటంకములు, ఎదుర్కొనవలసి వచ్చుచుండును. అయినను సర్దుబాట్లను సవరించుకొనగలరు. పుగాకు, మిర్చి, కలప ప్యాన్సీ పేపరూ అపరములు 3, 5, 7, 8, 9 మాసములు చాలా యోగదాయకములు. భూగృహాది మార్పులు వ్యాపారానుకూలతలు అగ, సెప్టెంబరు తదుపరి అనుకూలించును. శుభకార్యములు సెప్టెంబరు తరువాత అనుకూలములు. న్యాయవాదులకు సినీరంగ వైద్యులు మొదలగు వారికి ఈ సం॥రము శ్రీమతి గౌరవాభిమానముల కొరకు పాటుపడెదరు. విద్యుత్, వ్యాపారవృత్తి ఉద్యోగులకు సామాన్యకాలము. అధికారులున శ్రమ ఎక్కువగ ఉపయోగించవలెను. ఓర్పు అవసరము, వరముల బలహీనత అనారోగ్యములు కల్గి ధనవ్యయము కలుగుచుండును.

విద్యార్థులకు మొదటి ఛాన్సు అనుకూలముకాదు. వ్యాపారులకు నిల్వదారులకు అధిక లాభములు కలుగును. ప్రభుత్వ ఉద్యోగులు అధికారులు రాజకీయములు తగ్గించుట మంచిది. మిల్లర్లకు యంత్ర, ధాన్య వ్యాపారులకు ఏప్రిల్, జూన్, జూలై, అగస్టు మాసములు మంచివికాక మిగిలిన మాసములు అత్యంత యోగములు.

చిత్తా నక్షత్రమువారు జాతిపగడము ధరించుట వలనను, కుజ రాహు జపాభిషేకములు జరిపించుట మంచిది. విశాఖా నక్షత్రమువారు పుష్యరాగము ధరించుట వలనను, గురు జపాభిషేకములు జరిపించుట వలనను ధైర్యము, అధికారవృద్ధి, ఋణవిముక్తి, వ్యాపారము, వ్యవసాయమువృద్ధి శత్రుక్షయము కల్గి శుభకార్యాధిక్యతలు కల్గి వుందురు. వ్యవసాయదారులకు 2 వ పంట యోగించును.

ఈ రాశి వారలు నీలమణిని ధరించుట వలనను శని రాహు సుబ్రహ్మణ్య స్తోత్రములు పఠించుట వలన శివదర్శనము చేయుట వలనను అర్థలాభము మనస్తాపము కలుగును.

1,3,4,5,8,9 తేదీలు సంఖ్యలు, ఆది, సోమ, మంగళ, శనివారములతోకలసిన మరింతయోగ్రప్రదము.

## వృశ్చికరాశి

(విశాఖ 4 అనూరాధ జ్యేష్ఠా వార్లు)

ఆదా: 2 వ్యయం: 8 రాజ పూ: 1 అవ: 2

సంవత్సరాదినుండి జన 25 వరకు 3 ట గురుడు తామ్రమూర్తి, తదాది 4 ట రజితమూర్తి సం॥ర మంతయు రాహువు 6 ట కేతువు 12 ట సువర్ణమూర్తులు శని మే 31 వరకు 1 ట సువర్ణమూర్తి తదాది సెప్టెం 16 వరకు 12 ట లోహమూర్తి తదాది సంవత్సరాంతము జన్మమందు సువర్ణమూర్తి.

వృశ్చికరాశివారికి ఈ సం॥ర మంతయు పరీక్షాకాలముగ నుండును. ఆరోగ్యము సామాన్యము ఆదాయమునకు మించిన ఖర్చులు ఎదురగుట, ఆకస్మిక యత్నస్థానచలనాదులు, తొందరపాటు మొదలగు లక్షణములుండును. ఆదాయ గౌరవముల కొరకు పాటు పడెదరు. సస్యములు బాగుండినను పంటలుచేతికి పూర్తిగ అందవు. రాజకీయములవారు తమకంటే తక్కువవారి సహాయము కోరవలసి వచ్చును. లావాదేవీలు నిలచియు వ్యతిరేకముగా నుండును. అధికారులు. ఉద్యోగస్తులు పట్టుదల వహించుట మంచిదికాదు. విద్యార్థులకు ఫలితములు అనుకూలములు, బంధుమిత్రులు ఆత్మీయులతో కలతలు తట్టుకొనవలయును.

అపరములు, మిర్చి, పుగాకు. కలప, పేపరు వ్యాపారరంగముల వారికి 4, 5, 7, 8. 11, 12 మాసములు వాంఛాఫలితములు రావు, నూనె, బట్టలు, బెల్లము, ఇనుము వర్తకమండలి వారికి ఉత్తరార్థ సం॥రమున ఫలితములు బాగుండును. ప్రతిపనియందు అధైర్యము, శ్రమ పట్టుదల కల్గిననూ నెమ్మదిమీద పనులు సాధించుకొన గల్గుదురు.

విశాఖవారలు పుష్యరాగము అనురాధ నక్షత్రమువారు నీలమణిని జ్యేష్ఠానక్షత్రమువారు పచ్చ రాయి ధరించుట వలనను మనశ్శాంతి ధైర్యము, అపమృత్యుభయముకల్గి ఉత్సాహముగ నుందురు. అధికార వ్యవసాయదారులకు సం॥రము సామాన్యము భూగృహ మార్పులు నూతన వ్యాపార వాంఛలు కలసి వచ్చును.

మొత్తముమీద ఈ రాశివారు శని గురు జపాభిషేకములు జరుపుట వలన యథాశక్తి శాంతులు జరుపుట వలనను నీలమణిని ధరించుట వలనను శివదర్శనము చేయుటవలనను ఏలాంటి శని దోషములు కొంతవరకు తగ్గి మనశ్శాంతిగల్గివుందురు.

దుర్గాసుబ్రహ్మణ్యపూజలు చేయుటవలన కార్యవిలంబన లేక యంత్ర మంత్ర బలాధిక్యతనొంది ఆరోగ్య యత్నకార్యసిద్ధి శుభకార్య అనుకూలములు పొందెదరు.

1, 2, 4, 5, 6, 9 సంఖ్యలు ఆదిత్యాంగారక బుధ శుక్రవారములు అదృష్టప్రదములు.

## ధనూరాశి

(మూల, పూషా ఉ.షా 1వ పాదమువారికి)

ఆదా: 5 వ్యయం: 14 రాజ: 4 అవ: 2

ఈ సంవత్సరము అంతయు రాహువు 5 ట, కేతువు లాభమందు రజితమూర్తిలు, గురుడు జనవరి 25 వరకు 2 ట రజితమూర్తి. తదుపరి 3 ట లోహమూర్తి, శని మే 31 వరకు 12 ట లోహమూర్తి, తరువాత సెప్టెంబరు 18 వరకు 11 ట సువర్ణమూర్తి తరువాత 12 ట తామ్రమూర్తి.

వ్యాపారస్తులు ప్రభుత్వ ఇబ్బందులకు గురి అవుదురు. స్థానచలన మార్పులు, వివాహాది శుభ కార్యములు, వ్యయసూచనలు కల్గుచుండును. కోపోద్రిక్తత, చంచలత్వము, అక్రమ వ్యాపారములు చేయుచుందురు. ఆదాయమునకు మించిన ఖర్చులు, తరచు ఋణములు చేయవలసివచ్చును. ఔషధసేవ చేయవలసివచ్చును. వ్యవసాయదారులకు ఫలితములు సామాన్యములు, విద్యార్థులు అధిక్యత, పట్టుదల కలిగివుందురు. వర్తకేతరులకు 3 ట 1 వ వంతు లాభము.

అధికారులు, ఉద్యోగులు స్థానము సంపాయించుకొనుటకు ప్రయత్నింతురు. తైల, యంత్ర, రసాయన, వ్యాపారులకు జనవరి, ఏప్రిల్, జూలై, అగష్టు, సెప్టెంబరు, జనవరి, ఫిబ్రవరి మాసములు యోగదాయకములు. కలప, ప్యాక్టీ, పేపరు, కుంకుళ్ళు, అపరములు, కొబ్బరి, మిర్చి, చింతపండు వ్యాపారులుమాత్రము కొన్ని అవస్థలు ఎదుర్కొనవలసివచ్చుచుండినను ఫలితములు శుభప్రదములు.

వీరికి ప్రతివిషయమునందు శ్రమ, ఆందోళన, వ్యాకులత హృదయ దౌర్బల్యములు కల్గుచుండినను క్రమమున సవరణనొందగలరు. ఇతరుల వ్యాపారములందు జోక్యము కల్గించుకొనవలసివచ్చినను జాగ్రత్త అవసరము, లావాదేవీలు అనుకూలములు, వ్యయప్రయాసలతో కూడిన ప్రయాణములు ఎదుర్కొనవలసివచ్చును.

మూలవారు వైడూర్యము, పూషా వారు వజ్రము, ఉ-షా వారు ఇంద్ర నీలము ధరించుటవలన బుద్ధిబలము, మనశ్శాంతి, ఋణవిముక్తి పొందెదరు. తీర్థయాత్రలు, భూగృహ మార్పులు తప్పవు. రాజకీయములు యోగములు. మిల్లర్లు, పెట్టుబడిదారులు, విల్వదారులు పెట్టుబడులు తగ్గించుట మంచిది. వ్యవసాయము సామాన్య ఫలితములు కల్గును.

శ్రీ వేంకటేశ్వర స్తోత్ర పారాయణ, శివదర్శనము చేయుటవలననూ శని గురులకు జపాభిషేకములు చేయుటవలనను పుష్యరాగము ధరించుట వలనను శుభ ఫలితాధిక్యతనొంది మనో స్థిమితము పట్యత, మొదలగు లక్షణములు కల్గును.

1,2,5,6,7,9 సంఖ్యలు ఆది, మంగళ, శుక్రవారములతో కలసివచ్చిన మరింత యోగప్రదములు.

## మకరరాశి

(ఉషా 2.3 4 శ్రవణం ధనిష్ఠ 1.2 పాదములు)

ఆదా: 8 వ్యయం: 8 రాజ: 7 అవ: 2

శని సంవత్సరాది నుండి మే 31 వరకు లాభమందు సువర్ణమూర్తి, తరువాత సెప్టెంబరు 18 వరకు 10 ట తామ్రమూర్తి, తదుపరి లాభమందు రజితమూర్తి, గురుడు జనవరి 25 వరకు జన్మమందు లోహమూర్తి, తరువాత 2 ట తామ్రమూర్తి. సం॥ర మంతయు రాహువు 4 ట కేతువు 10 ట లోహమూర్తులు.

మకర రాశివారికి ఈ సం॥రము అత్యంత యోగము, 4,6,7,12 మాసములు యోగించవు, ఈ కాలములందు ఆకస్మిక సంచలనాదులు, వ్యాపార సంబంధ ఇబ్బందులు, నేత్రచికిత్సలు, అనారోగ్యములు, కళత్ర అనారోగ్యములు కల్గును. అయినను ఫలితములు బాగుండును. వ్యవహారములందు ఆటంకములు కల్గుచున్నను కొంత మేలుకల్గును. భూగృహసంబంధ మార్పులు కలసివచ్చును. అక్రమ వ్యాపారము లుండును. వ్యాపారస్తులకు ఆశించిన ఫలితములుండును.

కలప, మిర్చి, పుగాకు, అపరములు, పేపరు, ఫ్యాన్సీ, వ్యాపారములవారు 4,9,12,1,3, మాసములు జాగ్రత్తపడవలెను. ఉషానక్షత్రమువారు 7,9 మాసములు మరియు ఫిబ్రవరి నుండి స్థానచలనాది భయాందోళనలు కల్గుచుండినను నివృత్తి చేసుకొందురు. వీరు ఇంద్రనీలము రంగుగానీ, రాయి ఉంగరము నందుగానీ ధరించవలెను. శ్రవణానక్షత్రమువారు జనవరి వరకు యోగకాలము. తరువాత ప్రతిబంధకములు, కార్యవిలంబనలు కలుగుచుండును. తెలుపు ధరించవలెను. ధనిష్ఠా నక్షత్రమువారు 4, 5, 12 మాసములు మెలకువ చూపిన సరిపడును.

విద్యార్థులు ఉన్నతస్థాన మధిష్ఠింతురు. వ్యవసాయములు యోగించును. వైద్య, న్యాయవాద, టెక్నికల్స్ సినీవృత్తులవారికి సం॥రము 4 ట 3 వంతులు లబ్ధిని పొందెదరు. యంత్ర, వ్యావారులు, మిల్లర్లు, ధాన్యము వ్యాపారము చేయువారు 4, 6, 7, 8 మాసములు సామాన్య ఫలితముల నొందెదరు. నూనె, చింతపండు, ఫ్యాన్సీ, కలప అపర ధాన్యాదులవారు రాయి, బొగ్గు బట్టలు వ్యాపారములవారు నిల్వదారులు ఈ సం॥రము మొత్తముమీద అధికలాభములు పొందెదరు.

వీరికి అదృష్టసంఖ్య 2, 3, 5, 6, 8, 9 తేదీలు సంఖ్యలు సోమ, మంగళ, గురు, శుక్రవారములతో కలిసిన యోగప్రదములు. మొత్తముమీద ఈ సం॥రము యోగప్రదము.

## కుంభరాశి

(ధనిష్ట 3, 4, శతతార పూ భా 1, 2. 3. పాదములు)

ఆదా: 8 వ్యయం: 8 రాజ పూ: 3 అవ: 5

ఈ రాశివారికి రాహువు సం॥ర మంతయు 3 ట, కేతువు 9 ట, తామ్రమూర్తులు గురుడు వ్యయమందు జనవరి 25 వరకు తామ్రమూర్తి తదాది జన్మమందు సువర్ణమూర్తి శని మే 31 వరకు 10ట తామ్రమూర్తి తరువాత సెప్టెం 16 వరకు 9 ట రజితమూర్తి తరువాతి సం॥రము 10 ట లోహమూర్తి.

ఈ సం॥రము అంతయు గురు రాహువులు అనుకూలురు. శనికేతువులు సామాన్య ఫలితములు చేకూర్చెదరు. ఈ సం॥రమున అక్టో 25 వరకు ఎక్కువ శుభయోగములు కలుగుచుండును. ప్రతిపని యందు సమఫలితము మాత్రము పొందగలరు. ప్రతిపనియందు అసక్తి తక్కువగనుండి అప్రమత్తముగ వ్యవహరించుటయు, ఊహించని ఫలితములు పొందెదరు. వాక్పౌరుషము హెచ్చుగనుండును. ప్రతి పని యందు శత్రుత్వము, వ్యయప్రయాసలు కల్గుచుండినను నూటికి 70 శాతము అనుకూలతకల్గివుందురు.

వీరికి 4,6 నుండి 9 మాసములు అంతగా రాణించవు. లావాదేవీలు అటంకములు కల్గించినను సర్దుబాట్లగును. తరచు ఔషధ సేవచేయవలసివచ్చును. భూ వ్యాపార రీత్యా ధన వ్యయములు కల్గుచుండును. వ్యాపారులకు పెట్టుబడులు 50 శాతము తగ్గించుటవలన లాభాధిక్యతనొందగలరు. పుగాకు, మిర్చి, పేపరు, అపరములు, కుంకుమ, తైలముల వ్యాపారులు కాల, ప్రభుత్వములకు లోనవ్వవలసివచ్చును. బట్టలు, ఫ్యాన్సీ, కరెంటు అలంకారవస్తువుల వ్యాపారులు పైమాసములుకాక ఇతర మాసములు సత్ఫలితముల నొందెదరు.

సివిల్ న్యాయవాద వైద్య, గణిత వృత్తులవారికి యోగ్యప్రదములు. ధాన్యము, మిల్లర్లు, యంత్ర వర్తకమందలివారికి ఈ సం॥రము 3 ట 2 వంతుల ఫలితములు బాగుండును. విద్యార్థులు హెచ్చు కృషి చేయవలయును తరచు సెప్టెంబరు ఛాన్సులు చూడవలసివచ్చుచుండును.

ధనిష్ఠానక్షత్రమువారు దీశంబరువరకు గురుస్తోత్రములు పఠించుట, శివస్తోత్రములు చేయుచుండ వలయును. వీరు ఉంగరమునందు పగడము ధరించవలెను. శతతారానక్షత్రమువారు దరహము మీద ఈ సం॥రము మంచిఫలితములు నిర్మాణములు శుభకార్యములు చేయుదురు. వీరు జాతిగోమేధకము ధరించుట వలన అధికార వ్యాపారవృద్ధి కల్గివుండెదరు. పూర్వాభానక్షత్రమువారికి ఈ సం॥రము యోగ్యప్రదము.

తరచు తీర్థయాత్రలు, పుణ్యక్షేత్ర సందర్శనములు గావించుచుందురు. భూగృహాది శుభకార్యాది శుభ వ్యయములు ఉత్తరార్థ సం॥రమున నెరవేరును. వీరు మొత్తముమీద నీలమణివి ధరించుట వలన సుబ్రహ్మణ్య, శ్రీ వెంకటేశ్వరపూజలు చేయుట వలన యత్నకార్యసిద్ధి కల్గును. అదృష్టసంఖ్య 4,9,7. ఆది, మంగళ, బుధ, శుక్రవారములు, 1,2,3,4,7,8,9 తేదిలు మంచివి.

## మీనరాశి

(పూర్వాభా 4 పాదము ఉభా. రేవతి నక్షత్రములవారు)

ఆదా: 5 వ్యయం: 14 రాజ పూ: 6 అవ: 5

సంవత్సరమంతయు రాహువు 2 ట కేతువు, 8 ట రజితమోర్తులు, సంవత్సరాదినుండి గురుడు జనవరి 25 వరకు లాభమందు సువర్ణమూర్తి. తరువాత సంవత్సరాంతము 12ట రజితమూర్తి శని మే 31 వరకు భాగ్యమందు రజితమూర్తి, తరువాత సెప్టెంబరు 16 వరకు 8 ట లోహమూర్తి, తరువాత సం॥రాంతము 9 ట తామ్రమూర్తి.

ఈ రాశివారికి ఈ సం॥రము యోగ్యప్రదమయినది. శుభ కార్య అనుకూలములు ఆగస్టు తదుపరి కలసివచ్చును. తరచు ఋణములు భూగృహ రీత్యా చేయవలసివచ్చుచుండును. దూర ప్రదేశగమనము, ధనచికాకులు, ఆటంకములు ఎదుర్కొనవలసివచ్చుచుండును. సం॥ర ఉత్తరార్థము ఎక్కువ యోగ్యప్రదమయినది. 6,7,8 మాసములు, 11,1 మాసములు మంచివికావు. ప్రతికూలములు, కార్యవిలంబనములు, విరోధములు, అనారోగ్యములు, స్థాన చలనము మొదలగు ఫలితములుండును. తరచు ఔషధసేవలు చేయవలసివచ్చుచుండినను ఆరోగ్యము బాగుండును.

లావాదేవీలు ఒకరివారికి రాగలవు. భూగృహాది మార్పులు అనుకూలములు. యత్నకార్యసిద్ధి కొద్ది శ్రమానంతరము ఫలించును. 4,5,6,12,1,3 మాసములు యోగ్యప్రదములు, అధికారులు, న్యాయవాదులు, సినీరంగములవారు 3,4,7,8,12 మాసములు జాగ్రత్తవహించుట మంచిది. ఆపరములు, నూలు, పేపరు, బట్టలు, ఇనుము, చింతపండు, తైలములు మొదలగు వర్తకమందలివారికి సగముఫలితములు చేతికి అందును. తైలము, ఇనుము, ధాన్యము, వ్యాపారములవారికి నూతన వ్యాపారములు కలసివచ్చును స్పెక్యులేషన్ అవసరములేదు. కంట్రాక్టర్లకు లాభములుకలవు. దైవచింత ఎక్కువేగును. తీర్థయాత్రలు ఫలించును. విద్యార్థులకు ఫలితములు మిశ్రమములు. పూ,భా నక్షత్రమువారు జాతిపుష్యరాగము, ఉత్తరాభాద్రానక్షత్రమువారు నీలమణివి, రేవతివారు పచ్చరాయి ధరించుటవలన మనశ్శాంతి, ఆరోగ్యము, శతృసంహారము, ధైర్యముకల్గివుందురు. మిల్లర్లకు ఈ సం॥రమున 2,4,5,7,9 మాసములుకాక మిగిలిన మాసములు సత్ఫలితములనొందెదరు.

మొత్తముమీద ఈ రాశివారు పుష్యరాగము ధరించుటయు, శని, గురు, రాహువులకు జపాభిషేకములు, దుర్గా శ్రీ వేంకటేశ్వర స్తోత్రములు చేయుటవలనను గురువార నియమములుండుట వలనను ఆరోగ్యము, శతృసంహారము కల్గి, యత్నకార్యసిద్ధి, శుభకార్యాదులు కలసివచ్చును.

1,2,4,6,8,9 సంఖ్యలు ఆది, మంగళ గురు, శనివారములు యోగ్యప్రదములు.

# శుభముహూర్తములు

## చైత్రమాసము

మార్చి 1985 22 శు॥౧ శుక్ర॥ ఉ-భా రాజదర్శనాదులు సింహము సా. గం. 5-11
23 ౨ శని॥ రేవతి ఉపనయన వివాహాదులు మిథునము ప. 11-48
అశ్విని. వివాహాదులు ధనుస్సు రా. 11-41
27 ౬ బుధ॥ మృగ వివాహ గృహప్రవేశాదులు ధనుస్సు రా. 1-27

ఏప్రిల్ 10 ౬ బుధ॥ మూల వివాహము మకరము రా. 2-57
13 ౯ శని॥ శ్రవణము. వివాహగృహారంభాదులు కుంభం తె. 4-10
14 ౧౦ ఆది॥ ధనిష్ఠ వివాహ గర్భాధాన గృహారంభాదులు ధనుస్సు రా. 11-23

## వైశాఖమాసము

24 శు ౪ బుధ॥ మృగశిర వివాహ గృహారంభ ప్రవేశాదులు మిథునము ప. 10-53
వివాహ గర్భాధాన గృహప్రవేశాదులు ధనుస్సు రా. 11-38
వివాహగృహారంభ ప్రవేశాదులు మీనము తె. 4-10
25 ౫ గురు॥ ఆర్ద్ర గర్భాధానము ధనుస్సు రా. 11-34
26 ౬ శుక్ర॥ పున ఉపనయనాదులు మిథునం ఉ. 10-45
27 ౭ శని॥ పుష్య ఉపనయన గృహారంభ ప్రవేశాదులు మిథునం ఉ. 10-41

మే 12 ౧౧ బుధ॥ ఉ-ఫ. అన్నప్రాశనోపనయన వివాహ గృహారంభ ప్రవేశాదులు, మిథునము ఉ. 10-26
8 బ ౪ బుధ॥ మూల. ఉపనయన వివాహాదులు మిథునము ఉ. 9-59
9 ౫ గురు॥ ఉ-షా. వివాహ గర్భాధానములు ధనుస్సు రా. 10-40
10 ౬ శుక్ర॥ శ్రవణము వివాహగర్భాధానములు ధనుస్సు రా. 10-36
వివాహాదులు మీనము రా. 3-8
* 11 ౭ శని॥ శ్రవణము ఉపనయన వివాహాదులు మిథునము ఉ. 9-48
12 ౮ ఆది॥ శత వివాహ గర్భాధానాదులు ధనుస్సు రా, 10-29
13 ౯ సోమ॥ గర్భాధానము ధనుస్సు రా. 9-33

## జ్యేష్ఠమాసము

22 శు ౩ బుధ॥ మృగ ఉపనయన, వివాహాదులు మిథునము ఉ. 9-8
ఆర్ద్ర గర్భాధానము ధనుస్సు రా. 9-49
24 ౫ శుక్ర॥ పున. ఉపనయన అక్షరస్వీకారాదులు కర్కా. ఉ. 9-53
26 ౭ ఆది॥ మఘ. వివాహము ధనుస్సు రా. 9-33
29 ౧౦ బుధ॥ ఉ-ఫ. ఉపనయన వివాహ గృహారంభాదులు కర్కా. ఉ. 9-34

జూన్ 2 ౧౪ ఆది॥ అనూ. వివాహ గృహారంభాదులు కర్కా. ఉ. 9-13
6 ౪ గురు॥ ఉ-షా. వివాహ గర్భాధానాదులు మకరము రా. 10-20
వివాహ గృహప్రవేశాదులు మీనము రా. 1-21
7 ౫ శుక్ర॥ శ్రవణము వివాహ గర్భాదానాదులు మకరము రా. 10-16

8 ౬ శని॥ ఉపనయనాది వివాహాదులు గృహారంభ ప్రవేశములు సింహము ప. 10_57
9 ౭ ఆది॥ శత. వివాహ గర్భాదానాదులు మకరము గా. 10_9
వివాహ గృహప్రవేశాదులు మీనము రా. 1_10
12 ౯ బుధ॥ ఉ-భా. వివాహగృహారంభములు కర్కా. ఉ. 8_40

ఆషాఢమాసము

28 శు ౪ బుధ॥ హస్త. అన్నప్రాశనము సింహము ఉ. 10_57
30 ౧౩ ఆది॥ అనూ, అన్నప్రాశనము సింహము ఉ. 10_40

జూలై 7 ౫ ఆది॥ శత. అన్నప్రాశనము సిం. ఉ. 10_13

అధిక శ్రావణమాసము

22 శు ౫ సోమ॥ ఉ-ఫ. అన్నప్రాశనము సింహము ఉ, 9_22
24 ౭ బుధ॥ చిత్త. అన్నప్రాశనము సిం. ఉ. 9_15
29 ౧౩ సోమ॥ మూల. అన్నప్రాశనము సిం. ఉ, 8_49
31 ౧౫ బుధ॥ ఉ-షా. అన్నప్రాశనము సిం. ఉ. 9_41

ఆగస్టు 3 బ ౩ శని॥ శత. అన్నప్రాశనము కన్య. ఉ. 10_4
11 ౧౦ ఆది॥ రో. అన్నప్రాశనము కన్య. ఉ. 9_33

నిజ శ్రావణమాసము

19 శు ౩ సోమ॥ ఉ-ఫ. అన్నప్రాశనము కన్య. ఉ. 9_1
హస్త గర్భాధానము మీనము రా. 8_13
21 ౬ బుధ॥ చిత్త అన్నప్రాశనము కన్య ఉ. 8_53
22 ౭ గురు॥ స్వాతి అన్నప్రాశన గృహారంభములు కన్య ఉ. 8_49
23 ౮ శుక్ర॥ అనూ వివాహ గర్భాదాన, గృహప్రవేశము మీనము రా. 9_17
25 ౧౦ ఆది॥ మూల వివాహ గృహారంభాదులు కన్య ఉ. 8_37
వివాహాదులు మీనము రా. 8_8
28 ౧౩ బుధ॥ వివాహ గర్భాధానాదులు మీనము రా. 7_56
29 ౧౪ గురు॥ వివాహ గృహారంభాదులు వృశ్చికము ఉ. 22_4
వివాహ గృహప్రవేశాదులు వృషభము రా. 12_9
30 ౧౫ శుక్ర॥ వివాహ గృహప్రవేశాదులు మీనము ఉ. 7_50
31 బ ౧ శని॥ పూ-భా. గర్భాధానము వృషభము రా. 11_29

సెప్టెంబరు 1 ౨ ఆ॥ ఉ-భా వివాహ గృహారంభ ప్రవేశాదులు కన్య ఉ. 8_10
2 ౩ సోమ॥ రేవతి గృహారంభ ప్రవేశాదులు వృషభము రా. 1_130
7 ౮ శని॥ రో వివాహ గృహ ప్రవేశాదులు మీనము రా. 7_16
వృషభము రా. 11_1
8 ౯ ఆది॥ మృగ వివాహ గృహారంభ ప్రవేశాదులు కన్య ఉ. 7_43
వివాహ గర్భాధాన గృహారంభ ప్రవేశాదులు మీనము రా. 7_12

భాద్రపదమాసము

18 శు ౨ సోమ॥ హస్త అన్నప్రాశనము వృశ్చికము ఉ, 10_59

ఆశ్వయుజమాసః

అక్టోబరు 16 శు ౨ బుధ॥ అనూ గర్భాధానము మిథునము రా. 10_22
18 ౫ శుక్ర॥ మూల వివాహాదులు మిథునము రా. 11_12
20 ౭ ఆది॥ ఉ-షా. వివాహము మిథునము రా. 11_14
23 ౧౦ బుధ॥ ధనిష్ఠ నూతనవ్యాపారము రాజదర్శనము ప. 2_10 కుంభము 3_25
శత వివాహగర్భాధానము మిథునము రా. 10_51
25 ౧౨ శుక్ర॥ ఉ-భా. వివాహ గర్భాధానాదులు మిథునము రా. 10_44
31 ౩ గురు॥ రో. వివాహ గర్భాధానాదులు వృషభము రా. 10_19
నవంబరు 1 ౪ శుక్ర॥ రో. వివాహాదులు ధనుస్సు ప. 11_1
మృగ వివాహ గర్భాధానాదులు మిథునము రా. 10_15
వివాహాదులు సింహము రా. 2_23
2 ౫ శని॥ మృగ. అన్నప్రాశన వివాహాదులు ధనుస్సు ప. 10_56
3 ౬ ఆది॥ పున. గర్భాధానము మిథునము రా. 10_7 కర్కాటకము రా. 11_5

కార్తికమాసము

17 శు ౫ ఆది॥ ఉ-షా. వైశ్యోపనయన వివాహగృహారంభప్రవేశాదులు ధనుస్సు ఉ. 9_37
వివాహ గర్భాధానాదులు కర్కా. రా. 10_11
19 ౭ మం॥ శత. గృహప్రవేశాదులు సింహము రా. 1_2
20 ౮ బుధ॥ శత. వివాహ గర్భాధాన నవగృహ ప్రవేశాదులు మిథునము రా. 8_59
వివాహ గృహప్రవేశాదులు సింహము రా. 1_9
23 ౧౧ శని॥ వివాహ గృహప్రవేశాదులు కర్కా. రా. 9_45
24 ౧౨ ఆది॥ వివాహాదులు ధనుస్సు ఉ. 9_29
మకరము ఉ. 10_59 వివాహము మిధునము రా. 12_53
27 ౧౫ బుధ॥ రోహిణి వివాహగృహప్రవేశాదులు మిథునము రా. 8_32
28 బ ౧ గురు॥ మృగ వివాహ గర్భాధాన గృహప్రవేశాదులు మిథునము రా. 8_27
వివాహ గృహప్రవేశాదులు సింహము రా. 12_37
29 ౨ శుక్ర॥ మృగ. వివాహ గృహారంభాదులు మకరము ఉ. 9_44
30 ౩ శని॥ పున. గర్భాధానములు కర్కాటకము రా. 9_31
డిశంబరు 1 ౪ ఆది॥ పున. గృహారంభాదులు ధనుస్సు ఉ. 8_59
గర్భాధానములు కర్కాటకము రా. 9_13
2 ౫ సో॥ పుష్యమి గృహారంభాదులు మకరము ఉ. 10_27
గర్భాధానము మిదునము రా. 7_55
4 ౭ బుధ॥ మఘ. వివాహము కర్కాటకము రా. 8_37
5 ౮ గురు॥ ఉ-ఫ. వివాహగృహ ప్రవేశాదులు కన్య రా. 1_45
6 ౯ శుక్ర॥ ఉ-ఫ. వివాహగర్భాధాన గృహప్రవేశాదులు మిథునము రా. 7_55
7 ౧౦ శని॥ హస్త వివాహ గృహారంభాదులు మకరము ఉ. 10_6
వివాహ గర్భాధానాదులు మిథునము రా. 7_51

మార్గశిరమాసము

13 శు ౨ శుక్ర॥ పూ-షా. గర్భాధానము మిథునము రా. 7_28
18 ౫ సోమ॥ ధనిష్ఠ అన్నప్రాశనాదులు కుంభము ఉ. 11_51

18 ౭ బుధ॥ శత. అన్నప్రాశనాదులు మకరము ఉ. 9_25
*20 ౯ శుక్ర॥ ఉ-భా. అన్నప్రాశనాదులు కుంభము ప. 11_35
*21 ౧౦ శని॥ రేవతి అన్నప్రాశనాదులు మకరము ఉ. 9_13
22 ౧౧ ఆది॥ అశ్వి. అన్నప్రాశనాదులు మకరము ఉ. 9_9
29 బ ౨ ఆది॥ పుష్య అన్నప్రాశనాదులు మకరము ఉ. 8_43

1986 పుష్యమాసము

జనవరి 12 శు ౨ ఆది॥ శ్రవణము అన్నప్రాశనము కుంభము ఉ, 10_5
13 ౩ సోమ॥ ధని అన్నప్రాశనము కుంభము ఉ. 10_1
22 ౧౨ బుధ॥ మృగ అన్నప్రాశనము కుంభము ఉ. 9_28
23 ౧౩ గురు॥ మృగ అన్నప్రాశనాదులు కుంభము ఉ. 9_25

ఫిబ్రవరి 1 బ ౭ శని॥ చిత్త అన్నప్రాశనము మీనము ఉ. 9_39
3 ౯ సోమ॥ అనూ. అన్నప్రాశనము మీనము ఉ. 9_31

మాఘమాసము

10 శు ౨ సోమ॥ శత. అన్నప్రాశనము కుంభము ఉ. 8_13
13 ౫ గురు॥ రేవతి అన్నప్రాశనాదులు మీనము ఉ. 8_42
19 ౧౦ బుధ. మృగ అన్నప్రాశనాదులు మీనము ఉ. 8_19

మార్చి 5 ౧౦ బుధ॥ మూల అన్నప్రాశనోపనయనములు మీనము ఉ. 7_24
6 ౧౧ గురు॥ పూ-షా. ఋగ్వేదోపనయనము మీనము ఉ. 7_21

ఫాల్గుణమాసము

12 శు ౨ బుధ॥ ఉ-భా. అన్నప్రాశన ఉపనయన వివాహాదులు మీనమున శుభనవమాంశగం. ఉ. 8_7
రేవతి వివాహ నిషేకాదులు కన్య, రా. 7_28 వివాహకూపారంభాదులు మకరము రా. 4_7
14 ౪ శుక్ర॥ అశ్విని. అన్నప్రాశనోపనయన వివాహాదులు మీనము ఉ. 8_49
16 ౬ ఆది॥ రో. వివాహాదులు మకరము రా. 3_40
19 ౯ బుధ॥ పునర్వసు గృహారంభాదులు కుంభము తె. 5_47
21 ౧౦ శుక్ర॥ పుష్యమి గృహారంభాదులు మకరము రా. 3_21
25 ౧౪ మం॥ ఉ-ఫ. వివాహ గృహారంభాదులు మకరము రా. 3_5
27 బ ౧ గురు॥ చిత్త గృహారంభ వివాహాదులు కుంభము తె. 5_17
28 ౩ శుక్ర॥ స్వాతి వివాహగృహారంభాదులు మకరము రా. 2_54
29 ౪ శని॥ అనూ వివాహ గృహారంభాదులు మకరము రా. 2_40
వివాహ గృహారంభ ప్రవేశాదులు కుంభము తె. 5_9

ఏప్రిల్ 3 ౯ గురు॥ శ్రవణము వివాహ గృహారంభాదులు మకరము రా. 2_31
4 ౧౦ శుక్ర॥ ధనిష్ఠ వివాహ గృహారంభ ప్రవేశాదులు కుంభం తె. 4_46

* ఈ గుర్తుగల శుభలగ్నమునకు రాహుకాలమున్నది. చాలా గ్రహబలము కల్గియున్నవి.

## గోచారఫలితములందు జన్మరాశికి గ్రహములు

ఈ క్రింది స్థానములందున్న మంచి ఫలితమునిచ్చును.

| | | |
|---|---|---|
| రవికి | — | 3,6,10,11 |
| చంద్రుడు | — | 1,3,6,7,10,11 |
| కుజుడు | — | 3,6,11 |
| బుధుడు | — | 2,4,6,8,10,11 |
| గురుడు | — | 2,5,7,9,11 |
| శుక్రుడు | — | 1,2,3,4,5,8,9,11,12 |
| శని | — | 3,6,11 |
| రాహువు | — | 3,6,11 |
| కేతువు | — | 3,6,11 |

## గ్రహములకు మిత్ర శత్రు సమసంఖ్యలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| సూర్య | 1 | — | 2,4, | 7,6,8 | 5 |
| చంద్ర | 2 | — | 1,4,7 | లేదు | 3,6,8,9 |
| కుజ | 9 | — | 3,6,9 | 5 | 6,8 |
| బుధ | 5 | — | 1.4,6 | 5,7 | 3,8,9 |
| గురు | 3 | — | 3,6,9 | 5,6 | 8 |
| శుక్ర | 6 | — | 3,6,9 | 1,2,4,7 | 3,9 |
| శని | 8 | — | 1,6,3,5 | 2,7,9 | 8 |
| రాహు | 4 | — | 1,2,7 | 6,8 | 5 |
| కేతు | 7 | — | 1.4,7,2 | 5 | 3,6,8.9 |

| | | |
|---|---|---|
| ఈ<br>సంపద | తూ<br>శుభము | ఆ<br>వంశహాని |
| ఉ<br>ధాన్యము | మధ్య<br>మరణము | ద<br>వైధవ్యం |
| వా<br>స్త్రీ వ్యభిచారము | వ<br>ఋణం, వ్యాధి | నై<br>కులవృద్ధి |

సూర్యుడున్న నక్షత్రము మధ్యన వ్రాసి అచ్చటనుండి తూర్పుగా వరుసక్రమములో మూడేసి నక్షత్రము వ్రాసిన అందు చంద్ర నక్షత్రమున్న చోటునుబట్టి ఫలితము చెప్పవలెను.

**పురుష నక్షత్రము**

- అశ్విని
- కృత్తి
- రోహి
- పున
- పుష్య
- హస్త
- అనూ
- శ్రవ
- పూ-భా
- ఉ-భా

**స్త్రీనక్షత్రము**

- ఉ-షా
- అశ్రేష
- మఘ
- పుష్య
- ఉత్తర
- పూ-షా
- ధనిష్ఠ
- ఆర్ద్ర
- రేవతి
- జ్యేష్ఠ
- భరణి
- చిత్ర
- స్వాతి
- విశాఖ

**పుంసక నక్షత్రము**

- శత
- మూల
- మృగ

## శ్రీ క్రోధన నామ సంవత్సర వ్రత దిన పట్టిక

| 1985–86 | శుక్లపక్షము | | | | కృష్ణపక్షము | | | | నక్షత్రములు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మాసములు | ప్రతిపత్ | షష్ఠి | ఏకాదశి | పూర్ణిమ ○ | ప్రతిపత్ | ఏకాదశి | మాసశివరాత్రి | అమావాస్య ● | కృత్తిక | రోహిణి | ఆర్ద్ర | పునర్వసు | శ్రవణం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| మార్చి 85 | 22 | 27 | | | | | | | 26 | 27 | +9 | 30 | |
| ఏప్రిల్ | 21 | 26 | 1 | 5 | 6 | 15 | 18 | 20 | 22 | 23 | 26 | 27 | 14 |
| మే | 20 | 25 | 1 | 4 | 5 | 15 | 18 | 19 | 20 | 21 | 23 | 24 | 11 |
| జూన్ | 19 | 25 | 30 | 3 | 4 | 14 | 16 | 18 | 16 | 17 | 20 | 20 | 7 |
| జూలై | 18 | 23 | 28 | 2,31 | 3 | 13 | 16 | 17 | 13 | 14 | 16 | 17 | 5 |
| ఆగష్టు | 17 | 21 | 26 | 30 | 31 | 12 | 14 | 16 | 10 | 11 | 13 | 14 | 1,28 |
| సెప్టెంబరు | 15 | 20 | 24 | 28 | 29 | 10 | 13 | 14 | 6 | 7 | 9 | 10 | 25 |
| అక్టోబరు | 1 | 19 | 2 | 28 | 29 | 10,1 | 12 | 13 | 30 | 4 31 | 6 | 8 | 2 |
| నవంబరు | 1,13 | 17 | *23 | 27 | 28 | 9 | 11 | 12 | 27 | 1 | 3 | 4 | 18 |
| డిశంబరు | 12 | 17 | 22 | 27 | 28 | 8 | 10 | 11 | 24 | 25 | 27 | 1,28 | 16 |
| జనవరి 86 | 11 | 16 | 21 | 25 | 26 | *7 | 9 | 10 | 20 | 21 | 24 | 25 | 12 |
| ఫిబ్రవరి | 9 | 15 | 20 | 24 | 25 | 5 | 7 | 8 | 9 | 18 | 20 | 21 | 8 |
| మార్చి | 11 | 16 | 22 | 26 | 27 | 6 | 9 | 10 | 16 | 17 | 19 | 20 | 8 |
| ఏప్రిల్ | | | | | | 5 | 7 | 8 | | | | | 4 |

ఇందు *గుర్తుగల తేదీకి పూర్వదినమున స్మార్తైకాదశి యగును.

## 5. శుభముహూర్తములకు యోగ్యమగు తిథివార నక్షత్రలగ్నములను తెలుపు చక్రము

ఈ ముహూర్తములకు ఏకవింశతి మహాదోషములు లేక యుండవలెను
పాపగ్రహాక్రాన్త, వేధ, రాహిత్యముగూడా యుండవలెను.

| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| విషేకము | 2-3-5<br>7-10 | సో-బు<br>గు-శు | అ-రో-ఉఫ-హ-స్వా-అనూ<br>ఉషా-శ్ర-శత-ఉభా | వృష-మిథు-కట<br>కన్య-తు-ధ-మీ | లగ్నశుద్ధి మాఘాది<br>పంచకము శుభము |
| గర్భాదానము | 2-3-5<br>7-10-13 | సో-బు<br>గు-శు | రో-మృ-పున-పుష్య-ఉఫ-హ<br>చి-స్వా-అనూ-ఉషా-శ్ర-ధ<br>శత-ఉభా | వృష-కట-కన్య-తు<br>ధను-మీనం | ౧-౮ శుద్ధి పంచపర్వ<br>ములు కూడవు |
| పుంసవనము<br>సీమంతము | 2-3-5-7<br>10-13 శు | సో-బు<br>గు-శు | అశ్వ-రో-మృ-పున-పుష్య<br>ఉఫ-హ-చి-స్వా-అనూ-మూ<br>ఉషా-శ్ర-ధ-శత-ఉభా-రే | మే-వృ-సిం<br>లగ్నములు కాక ఇతర<br>లగ్నములు శుభం | 4-8 మాసములు |
| జాతకర్మ<br>నామకరణం | 2-3-5-7<br>10-13 శు | సో-బు<br>గు-శు | అశ్వ-రో-పున-పు-ఉఫ-హ<br>స్వా-అనూ-ఉషా-శ్ర-ధ<br>శత-ఉభా | వృ-మి-కటక-కన్య<br>తుల-ధ-మీ | అష్టమశుద్ధి<br>పక్షచ్ఛిద్రములు<br>కూడదు |
| డోలా<br>రోహణం | 2-3-5-7<br>10-13 | సో-బు<br>గు-శు | అశ్వ-రో-మృ-పున-పుష్య<br>ఉఫ-హస్త-చి-అనూ<br>ఉషా-ఉభా-రేవతి | వృ-మి-కట-కన్య-తు<br>ధను-మీనం | 1-3-5 మాసములు<br>అష్టమశుద్ధి |
| అన్నప్రాశనం | 2-3-5-7<br>10-13 | సో-బు<br>గు-శు | అశ్వ-రో-మృ-పున-పు-ఉఫ<br>హ-చి-స్వా-అనూ-ఉషా-శ్రవ<br>ధ-శత-ఉభా-రేవతి | వృ-మిథు-కన్య-కట<br>ధను-మీనం | 10 శుద్ధి<br>పురుషులకు సరిమాసం<br>స్త్రీలకు బేసిమాసం |
| కర్ణవేధ | 2-3-5-7<br>10-13 | సో-బు<br>గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-ఉఫ<br>హస్త-చి-అనూ-ఉషా-శ్రవ<br>ధని-ఉభా-రే | వృ-మి-కటక-కన్య<br>ధను-మీనం | అష్టమశుద్ధి 6-7-8<br>మాసములు |
| కేశఖండనము | 2-3-5-7<br>10-13 | సో-బు<br>గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-హ<br>చి-స్వా-శ్ర-ధ-శత-రే | వృ-మి-కటకం-కన్య<br>తుల-ధను-మీనం | ఉత్తరాయణం<br>పూర్వయామం |
| అక్షరా<br>భ్యాసము | 2-3-5<br>7-10 | సో-బు<br>గు-శు | అశ్వ-పున-పుష్య-హ-చి<br>స్వాతి-అనూ-శ్ర-రే | మే-కట-తు-మకర | అష్టమశుద్ధి ఉత్తరా<br>యణము 5-వ సంవ<br>త్సరము |
| విద్యాభ్యాసము | 2-3-5<br>7-10 | ఆ-సో-బు<br>గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-ఆర్ద్రి<br>ఆశ్లే-హ-చి-స్వా-మూ-శ్ర | కట-తుల-మక<br>మీనం-మేషం | అష్టమశుద్ధి అనధ్యాయ<br>రహితం |

# శుభముహూర్తములకు యోగ్యమగు తిథివార నక్షత్రలగ్నములను తెలుపు చక్రము

ఈ ముహూర్తములకు ఏకవింశతి మహాదోషరాహిత్యము యుండవలెను.
పాపగ్రహాక్రాన్త, వేధ, రాహిత్యముగూడా యుండవలెను.

| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| ఉపనయనము | 2-3-5-7-10 కృ 2-3 | బు-గు-శు | అశ్వ-రో-మృ-పున-పుష్య ఉఫ-హ-చి-స్వా-అనూ-ఉషా శ్ర-ధ-శ-ఉభా-రే | వృష-మిథున-కటక కన్య-ధను-మీనం | గా శుద్ధి అనధ్యయన కూడదు కేంద్రమున పాపులుండకూడదు |
| వివాహం | 2-3-5-7 10-13 | బు-గు-శు | రో-మృ-మఘ-ఉఫ-హ స్వా-అనూ-మూ-ఉషా ఉభా-రే | వృష-మిథు-కట-తుల కన్య-ధను-మీనం | సప్తమశుద్ధి మఖాది పంచకం |
| నూతన వస్త్రధారణం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-రో.మృ-పున-ఉఫ-హ చి-స్వా-అనూ-మూ-ఉషా శ్ర-ధ-శత-ఉభా-రే | వృష-మిథు-కట కన్య-తుల-ధ-మీనం | తృతీయశుద్ధి |
| శంకుస్థాపనం | 2-3-5-7 10-13 | బు-గు-శు | అశ్వ-రో-మృ-పున-పు-ఉఫ హ-చి-స్వా-అనూ ఉషా-శ్ర-ధ-శత-ఉభా | వృష-మిథు-కన్య ధను-మీనం | చతుర్థశుద్ధి అష్టమశుద్ధి |
| గృహ ప్రవేశము | 2-3-5-7 10-13 | బు-గు-శు | రో-మృ-ఉఫ-చి-అనూ ఉషా-ధ-శత-ఉభా-రే | వృష-మిథు-కన్య ధను-మీనం | చతుర్థశుద్ధి అష్టమశుద్ధి వృషభకలశ చక్రశుద్ధి స్థిరలగ్నము |
| కూపారంభం | 2-3-5-7 10-13 | సో-గు-శు | రో-పుష్య-మృ-ఉఫ-హ అనూ-ఉషా-శ్ర-ఉభా | కట-మక-మీనం | లగ్నమున చంద్ర శుక్రలు ఉత్తరము తూర్పు ఈశాన్యం శుభం |
| ప్రయాణం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-హ అనూ-శ్ర-ధ-రే-మూల | మేష-వృష-కట కన్య-తుల-ధను మీనం | వారశూలలు కూడదు |
| బీజావాపనం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-రో-మృ-పుష్య-ఉఫ హ-స్వా-అనూ-ఉషా-శ్ర-ధ ఉభా-రేవతి | వృష-మిథు-కటక కన్య-ధను-మీనం | విత్తనముల రంగు ననుసరించినవారములు మంచివి |
| క్షౌరం | 2-3-5-7 13 | సో-బు | అశ్వ-మృ-పున-పు-హ-చి స్వా-శ్ర-ధ-శత | వృష-మిథు-కట-తుల ధను-మీనం | భోజనానన్తరం కూడదు భార్య 6 మాసములు గర్భవతిగనుండ కూడదు |
| వాణిజ్యం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-రో-మృ-పుష్య-హ చి-అనూ-రేవ-ఉత్త-ఉ-షా ఉ-భా | వృష-మిథు-కట కన్య-తు-ధ-మీనం | లాభ 11 స్థానమున శుభగ్రహముగాని దృష్టిగాని శుభము |

ఓమ్

శ్రియై నమః

శ్రీవేంకటేశాయ నమః

# పంచాఙ్గ విషయ విజ్ఞానమార్గము

భారతదేశమున వేదాంగమగు జోతిశ్శాస్త్రము ప్రతి మానవునకు అవసరమగు సాహాయ్యముసు చేయుచున్నది. ఆ జ్యోతిశ్శాస్త్రము జాతకభాగము, ముహూర్తభాగము, సిద్ధాన్తభాగము అని మూడు విధములుగా ప్రచారములోనున్నది. ప్రతి మానవునకు 1. జాతకభాగము, భూత భవిష్యద్వర్తమాన రూపమగు త్రికాల విషయములను చెప్పుచూ జీవయాత్రకు తోడ్పడుచున్నది. 2. ముహూర్త భాగము, కార్యసిద్ధిని శుభ ఫలములను సమకూర్చుచు సాహాయ్య మాచరించుచున్నది. 3. సిద్ధాంతభాగము, పంచాంగరూపముగా నేర్పడి దైనందినయాత్రలో సర్వ విధముల సాహాయ్య మాచరించుచున్నది.

ఈ భాగములన్నియు కాలమునకు సంబంధించియున్నవిగా తెలియదగియున్నది:

సమయవేత్తలు, ఆ కాలమును వత్సరము, అయనము, ఋతువు, మాసము, పక్షము, దినము అని ఆరు విధములుగా విభజించి ధర్మాచరణమునకు శ్రేయఃప్రాప్తికి మార్గమును చూపియున్నారు.

## 1. వత్సరము – అయిదు విధములు :

చాంద్రవత్సరము, సౌరవత్సరము, సావనవత్సరము, నాక్షత్రవత్సరము, బార్హస్పత్య వత్సరము.

1. చాంద్రవత్సరము : అనగా శుక్లప్రతిపత్ మొదలు దర్శాన్తములగు చైత్రాది మాసములు 12 కలదై 354 దినములు కలిగియుండును. ఈ చాంద్రవత్సరము ప్రభవాది అరువది నామములు కలదైయున్నది.
2. సౌరవత్సరము : అనగా మేషాది ద్వాదశరాశులయందు రవి సంక్రమణముచే ఏర్పడి 365 దినములు కలిగియుండును.
3. సావనవత్సరము : అనగా మాసమునకు ముప్పది దినముల చొప్పున 360 దినములు కలదై యుండును. ఇది యుగమన్వంతాది విభాగక్రమమును తెలియచేయును.
4. నాక్షత్రవత్సరము : అనగా అశ్విని మొదలు 27 నక్షత్రములయందు చంద్ర సంచారముచేత యేర్పడిన 12 మాసములు కలదై 324 దినములు కలిగియుండును.
5. బార్హస్పత్య వత్సరము : అనగా మేషాదిరాశులయందు బృహస్పతి సంచారముచేత యేర్పడి 361 దినములు కలిగియుండును.

## 2. అయనము – రెండు విధములు : ఉత్తరాయణము – దక్షిణాయనము

1. ఉత్తరాయణము : అనగా సూర్యునియొక్క మకర సంక్రమణము మొదలు ఆరు రాశులయందు సంచారముచేత యేర్పడునది. అప్పుడు భూమధ్యరేఖకు ఉత్తరముగా సంచరించును.
2. దక్షిణాయనము : అనగా సూర్యునియొక్క కటక సంక్రమణము మొదలు ఆరు రాశులయందు సంచారముచేత యేర్పడునది. అప్పుడు భూమధ్యరేఖకు దక్షిణముగా సంచరించును.

## 3. ఋతువు – రెండు విధములు : సౌరము – చాంద్రము

1. సౌరము : అనగా సూర్యునియొక్క రాశిద్వయ సంచారముచే యేర్పడి వసంతాది ఆరు నామములు కలిగియున్నది.
2. చాంద్రము : అనగా చైత్రాదిమాసద్వయ రూపమై వసంతాది ఆరు నామములు కలిగియున్నది.

4. మాసము – నాలుగు విధములు : చాంద్రము - సౌరము - సావనము - నాక్షత్రము

1. చాంద్రమాసము : అనగా శుక్లప్రతిపత్ మొదలు దర్శాన్తముగాని కృష్ణప్రతిపత్ మొదలు పూర్ణిమాన్తముగాని చాంద్రమాసము అని రెండు విధములుగా నున్నవి. అది చైత్రాదినామములు కలిగియున్నది.

దర్శాన్తమాసము – ముఖ్య పక్షము : పూర్ణిమాన్తమాసము - వింధ్యకు ఉత్తరదేశమునందు గ్రహింప దగియున్నది.

2. సౌరమాసము : అనగా కొందరు సూర్యుని మీనరాశి సంక్రమణమునుండి ప్రారంభించియు, కొందరు మేషరాశి సంక్రమణమునుండి ప్రారంభించియు, చైత్రాదిమాసములని చెప్పుచున్నారు.

3. సావనమాసము : అనగా ముప్పది దినములు గలదైయుండును.

4. నాక్షత్రమాసము : అనగా చంద్రుడు అశ్విని మొదలు 27 నక్షత్రములయందు సంచరించుకాలము.

5. పక్షము – రెండు విధములు : శుక్లపక్షము – కృష్ణపక్షము

1. శుక్లపక్షము : అనగా శుక్లప్రతిపత్ మొదలు పూర్ణిమాన్త పక్షము

2. కృష్ణపక్షము : అనగా బహుళ ప్రతిపత్ మొదలు దర్శాన్తపక్షము

6. దినము – అనగా :

అరువది ఘడియల కాలము. అది సూర్యోదయము మొదలు తిరిగి సూర్యోదయమువరకుగల కాలము. ఇటుల ఆరు విధములగు కాలమును తెలియజేయుటకు ప్రవర్తించునది పంచాంగము. ఇది మానవులకు కల్పవృక్షమువంటిది. అట్టి పంచాంగమును వివరణములతోను, విశేషములతోను తెలియుటకు మార్గమును చూడుము.

(1) పంచాఙ్గము : అనగా అయిదు అంగములు కలది. 1. తిథి, 2. వారము, 3. నక్షత్రము, 4. యోగము, 5. కరణము.

తిథులు 15 : 1. పాడ్యమి, 2. విదియ, 3. తదియ, 4. చవితి, 5. పంచమి, 6. షష్ఠి, 7. సప్తమి, 8. అష్టమి, 9. నవమి, 10. దశమి, 11. ఏకాదశి, 12. ద్వాదశి, 13. త్రయోదశి, 14. చతుర్దశి, 15. ○ పూర్ణిమ, ● అమావాస్య.

వారములు 7 : 1. ఆదివారము, 2. సోమవారము, 3. మంగళవారము, 4. బుధవారము, 5. గురువారము, 6. శుక్రవారము, 7. శనివారము.

నక్షత్రములు 27 : 1. అశ్విని, 2. భరణి, 3. కృత్తిక, 4. రోహిణి, 5. మృగశిర, 6. ఆర్ద్ర 7. పునర్వసు, 8. పుష్యమి, 9. ఆశ్లేష, 10. మఖ, 11. పుబ్బ (పూర్వఫల్గుని), 12. ఉత్తర (ఉత్తరఫల్గుని), 13. హస్త, 14. చిత్త 15. స్వాతి, 16. విశాఖ, 17. అనూరాధ, 18. జ్యేష్ఠ, 19. మూల, 20. పూర్వాషాఢ, 21. ఉత్తరాషాఢ (అభిజిత్), 22. శ్రవణం, 23. ధనిష్ఠ, 24. శతభిషం, 25. పూర్వాభాద్రా, 26. ఉత్తరాభాద్రా, 27. రేవతి.

యోగములు 27 : 1. విష్కంభం, 2. ప్రీతి, 3. ఆయుష్మాన్, 4. సౌభాగ్యం, 5. శోభనం, 6. అతిగండం, 7. సుకర్మ, 8. ధృతి, 9. శూలం, 10. గండం, 11. వృద్ధి, 12. ధ్రువము, 13. వ్యాఘాతము, 14. హర్షణము, 15. వజ్రము, 16. సిద్ధి, 17. వ్యతీపాత్, 18. వరియాన్, 19. పరిఘ, 20. శివం, 21. సిద్ధం, 22. సాధ్యం, 23. శుభం, 24. శుభ్రం, 25. బ్రాహ్మం, 26. ఐంద్రం, 27. వైధృతి.

కరణములు 11: 1. బవ, 2. బాలవ, 3. కౌలవ, 4. తైతుల, 5. గరజి, 6. వణజి, 7. భద్ర, 8. శకుని,
9. చతుష్పాత్, 10. నాగవం, 11. కింస్తుఘ్నం.

పక్షములు 2: 1. శుక్లపక్షము (చంద్రునకు కళలు వృద్ధియగు దినములు),
2. కృష్ణపక్షము (చంద్రునకు కళలు తగ్గిపోవు దినములు).

సూచన: పంచాంగములో ఈ తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములయొక్క ప్రథమాక్షరములను చూచి తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములుగా చదువుకొనవలయును.

## (2) మాసముల వివరణము:

| చాంద్ర | సౌర | ద్రావిడ | శాలి | | ఇంగ్లీషు | |
|---|---|---|---|---|---|---|
| చైత్రము | మేషం | చిత్తి | చైత్ర | 30 | జనవరి | 31 |
| వైశాఖము | వృషభం | వైయ్యాశి | వైశాఖ | 31 | ఫిబ్రవరి | 28 |
| జ్యేష్ఠము | మిథునం | ఆని | జ్యేష్ఠ | 31 | మార్చి | 31 |
| ఆషాఢము | కర్కాటకం | ఆడి | ఆషాఢ | 31 | ఏప్రియల్ | 30 |
| శ్రావణము | సింహం | అవణి | శ్రావణ | 31 | మే | 31 |
| భాద్రపదము | కన్య | పెరటాసి | భాద్రపద | 31 | జూన్ | 30 |
| ఆశ్వయుజము | తుల | అల్పిశి | ఆశ్వన | 30 | జూలై | 31 |
| కార్తీకము | వృశ్చికం | కార్తికి | కార్తిక | 30 | ఆగస్టు | 31 |
| మార్గశిరము | ధనుస్సు | మార్గశి | మార్గశీర్ష | 30 | సెప్టెంబరు | 30 |
| పుష్యము | మకరం | తై | పౌష | 30 | అక్టోబరు | 31 |
| మాఘము | కుంభం | మాశి | మాఘ | 30 | నవంబరు | 30 |
| ఫాల్గుణము | మీనం | పంగుని | ఫాల్గుణ | 30 | డిశంబరు | 31 |

సూచన: శాలి, ఇంగ్లీషు నెలలలో ప్రక్కనగల సంఖ్యలు ఆ నెలలకుగల రోజులుగా తెలియవలెను.

## (3) చాంద్రమాసమున మాసనామ నిర్ణయము ఇట్లు యేర్పడెను.

| | | | | |
|---|---|---|---|---|
| పూర్ణిమయందు | చిత్తా | నక్షత్రముగల | మాసము | చైత్రమాసము |
| ,, | విశాఖా | ,, | ,, | వైశాఖమాసము |
| ,, | జ్యేష్ఠ | ,, | ,, | జ్యేష్ఠమాసము |
| ,, | పూర్వాషాఢ, ఉత్తరాషాఢ | | | ఆషాఢమాసము |
| ,, | శ్రవణ | ,, | ,, | శ్రావణమాసము |
| ,, | పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర | | | భాద్రపదమాసము |
| ,, | అశ్విని | ,, | ,, | ఆశ్వయుజమాసము |
| ,, | కృత్తిక | ,, | ,, | కార్తీకమాసము |
| ,, | మృగశిర | ,, | ,, | మార్గశిరమాసము |
| ,, | పుష్యమి | ,, | ,, | పుష్యమాసము |
| ,, | మఘ | ,, | ,, | మాఘమాసము |
| ,, | పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని | | | ఫాల్గుణమాసము |

(4) సౌరమాసమున మాసనామ నిర్ణయము ఇట్లు యేర్పడెను.

| | | | | |
|---|---|---|---|---|
| సూర్యుడు | మేష లగ్నమున | ప్రవేశించినది | మొదలు | మేషమాసము |
| ,, | వృషభ | ,, | ,, | వృషభమాసము |
| ,, | మిథున | ,, | ,, | మిథునమాసము |
| ,, | కర్కాటక | ,, | ,, | కర్కాటకమాసము |
| ,, | సింహ | ,, | ,, | సింహమాసము |
| ,, | కన్య | ,, | ,, | కన్యామాసము |
| ,, | తులా | ,, | ,, | తులామాసము |
| ,, | వృశ్చిక | ,, | ,, | వృశ్చికమాసము |
| ,, | ధనుస్సు | ,, | ,, | ధనుర్మాసము |
| ,, | మకర | ,, | ,, | మకరమాసము |
| ,, | కుంభ | ,, | ,, | కుంభమాసము |
| ,, | మీన | ,, | ,, | మీనమాసము |

(5) ద్రావిడమానములు, సౌరమానముననుసరించి సూర్యుడు మేషము, వృషభము మొదలగు లగ్నముల యందు ప్రవేశించిన దినములయందే చిత్రి, వైయ్యాశి మొదలగు మాసములు ప్రారంభమగుచున్నవి. చాంద్రమానచ్ఛాయ ననుసరించి సామాన్యముగా ఆ మాసముల నామములు యేర్పడుచున్నవిగా భావించవలెను.

(6) శాలిశకమాసములు, సౌరమానము ననుసరించి సూర్యునియొక్క మేషసంక్రమణమునకు ముందుగా మేషాయనము ప్రారంభమగుచున్నది. ఆ మేషాయన ప్రారంభదినమే శాలిశక చైత్రమాస ప్రారంభదినము. ఇటులనే సూర్యునియొక్క వృషభాది సంక్రమణములకు ముందుగా వృషభాద్యయనములు ప్రారంభమగుచున్నవి. ఆ వృషభాద్యయన ప్రారంభదినములే శాలిశక వైశాఖాది మాస ప్రారంభ దినములగుచున్నవి. ఇటుల శాలి శకమాసములు సౌరమానముననుసరించి ప్రారంభ మగుట, చాంద్రమానము ననుసరించి చైత్ర వైశాఖాది నామములు యేర్పడుట అని తెలియదగి యున్నది. ముఖ్యాంశమేమన సూర్యునియొక్క మేషాదిలగ్న సంక్రమణముల ననుసరించి ద్రావిడ మాసములు చిత్రి, వైయ్యాశి అను మొదలగు మాసనామములు ప్రారంభమగుచున్నవి. సూర్యుని యొక్క మేషాద్యయనముల ననుసరించి శాలిశకమాసములు చైత్ర, వైశాఖ మొదలగు మాసములు ప్రారంభమగుచున్నవిగా తెలియదగియున్నది. రెంటికి మాసముల నామములు చాంద్రమానచ్ఛాయ లోనే యేర్పడుచున్నవి గాని వేరుగాదు అని తెలియదగియున్నవి.

(7) 1. చైత్రశుద్ధ పాడ్యమి - చాంద్రమాన సంవత్సర ప్రారంభమగును. 2. మేషమాసము 1 వ తేదీ సూర్యుని మేషసంక్రమణ ప్రారంభమే సౌరమాన సంవత్సర ప్రారంభమగును. 3. చిత్రినెల 1 వ తేదీ ద్రావిడ సంవత్సర ప్రారంభమగును. 4. సూర్యుని మేషాయన ప్రారంభమే చైత్ర 1 వ తేది శాలివాహనశక వత్సరారంభమగును. 5. జనవరి 1 వ తేది హూణశకవత్సర ప్రారంభ మగును. ఇటులనే భారతదేశమున పలువిధములగు సంవత్సరములు, తత్ప్రారంభములున్నూ కలిగియున్నవి.

(8) విశేషములు—హూణశక సంవత్సరములను నాలుగుచే భాగించిన శేషము సున్న వచ్చిన యెడల ఆ సంవత్సరమునకు లీప్ సంవత్సరమనిపేరు. అట్లు లీప్ సంవత్సరములో ఫిబ్రవరినెలకు 29 దినములు వచ్చును. శాలివాహశక వత్సరములను నాలుగుచే భాగించిన శేషము రెండువచ్చిన లీప్‌సంవత్సర మనబడును. అట్లు లీప్‌సంవత్సరములో చైత్ర 31 రోజులు—మామూలు సంవత్సర

ములో ఆ చైత్ర 30 రోజులుకలదై యుండును. వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ, భాద్రపద ఈ ఐదు నెలలలో ఎల్లప్పుడు ప్రతినెలకు 31 రోజులు ఉండును. మిగతా ఆశ్వీన, కార్తీక, మార్గశీర్ష, పౌష, మాఘ, ఫాల్గుణ ఈ ఆరునెలలలో ఎల్లప్పుడు ప్రతినెలకు 30 రోజులుండును.

(9) ఋతువులు 6: 1. వసంతర్తువు, 2. గ్రీష్మర్తువు, 3. వర్షర్తువు, 4. శరదృతువు 5. హేమంతర్తువు, 6. శిశిరర్తువు.

(10) అయనములు 2: 1. ఉత్తరాయణము అనగా భూమధ్యరేఖకు ఉత్తరమున సూర్యుడు సంచరించుకాలము (మాఘమాసము మొదలు ఆషాఢమాసము వరకు). 2. దక్షిణాయనము అనగా భూమధ్యరేఖకు దక్షిణమున సూర్యుడు సంచరించుకాలము (శ్రావణమాసము మొదలు పుష్యమాసము వరకు) అని తెలియచగియున్నది.

(11) సంవత్సరములు 60:

| | | | |
|---|---|---|---|
| 1 ప్రభవ | 16 చిత్రభాను | 31 హేమలంబ | 46 పరిధావి |
| 2 విభవ | 17 సుభాను | 32 విళంబ | 47 ప్రమాదీ |
| 3 శుక్ల | 18 తారణ | 33 వికారి | 48 ఆనంద |
| 4 ప్రమోద | 19 పార్థివ | 34 శార్వరి | 49 రాక్షస |
| 5 ప్రజాపతి | 20 వ్యయ | 35 ప్లవ | 50 నల |
| 6 అంగీరస | 21 సర్వజిత్ | 36 శుభకృత్ | 51 పింగళ |
| 7 శ్రీముఖ | 22 సర్వధారి | 37 శోభకృత్ | 52 కాళయుక్త |
| 8 భావ | 23 విరోధి | 38 క్రోధీ | 53 సిద్ధార్థి |
| 9 యువ | 24 వికృతి | 39 విశ్వావసు | 54 రౌద్రి |
| 10 ధాత | 25 ఖర | 40 పరాభవ | 55 దుర్మతి |
| 11 ఈశ్వర | 26 నందన | 41 ప్లవంగ | 56 దుందుభి |
| 12 బహుధాన్య | 27 విజయ | 42 కీలక | 57 రుధిరోద్గారి |
| 13 ప్రమాధి | 28 జయ | 43 సౌమ్య | 58 రక్తాక్షి |
| 14 విక్రమ | 29 మన్మథ | 44 సాదారణ | 59 క్రోధన |
| 15 వృష | 30 దుర్ముఖ | 45 విరోధకృత్ | 60 క్షయ |

ఇవి పురాణ ప్రసిద్ధములగు సంవత్సరములుగా తెలియవలయును. ఇంగ్లీషు సంవత్సరములలో మార్చి, ఏప్రియల్ నెలలలో ఈ సంవత్సరములు ప్రారంభమగును. ఇంగ్లీషు సంవత్సరములలో మార్చి 21, 22 తేదీలలో శాలివాహనశక వత్సరము ప్రారంభమగును.

(12) నవగ్రహములు 9: 1. సూర్యుడు, 2. చంద్రుడు, 3. కుజుడు, 4. బుధుడు, 5. గురువు, 6. శుక్రుడు, 7. శని, 8. రాహువు, 9. కేతువు.

(13) ద్వాదశరాశులు 12:— 1. మేషము, 2. వృషభము, 3. మిథునము, 4. కర్కాటకము 5. సింహము, 6. కన్య, 7. తుల, 8. వృశ్చికము, 9. ధనుస్సు, 10. మకరము, 11. కుంభము, 12. మీనముఈ రాశులను లగ్నములు అనియు, హోరలనియు వ్యవహరించుచున్నారు. ఈ ద్వాదశ రాశులలో 1,4,7,10 చరరాసులు; 2,5,8,11, స్థిరరాశులు; 3,6,9,12, ద్విస్వభావ రాశులుగా తెలియవలెను.

(14) ఈ ద్వాదశరాశులకధిపతులు:

1. మేషమునకు 8 వృశ్చికమునకు=కుజుడు.
2. వృషభమునకు 7 తులకు=శుక్రుడు.
3. మిథునమునకు 6 కన్యకు=బుదుడు.
4. కర్కాటకమునకు=చంద్రుడు.
5. సింహమునకు=సూర్యుడు.
9. ధనుస్సుకు 12 మీనమునకు=గురువు
10. మకరమునకు 11 కుంభమునకు=శని

(15) ఈ రాశులు నక్షత్రములువలన యేర్పడుచున్నవి. ఎట్లు అనగా ఒక్కొక్క నక్షత్రమునకు నాలుగు పాదములు. అందుచే 27×4=108 పాదములు. ఈ పన్నెండు రాశులకు 108 పాదములు చేర్చవలెను. 12×9=108 పాదములు గాన ఒక్కొక్కరాశికి 9 పాదములు చేరుచున్నవి. అనగా వివరణ మిట్లు:

| | | |
|---|---|---|
| 1. అశ్విని 4, భరణి 4, కృత్తిక 1 | = 9 పాదములు | మేషము |
| 2. కత్తిక 3, రోహిణి 4, మృగశిర 2 | = 9 పాదములు | వృషభము |
| 3. మృగశిర 2, ఆర్ద్ర 4, పునర్వసు 3 | = 9 పాదములు | మిథునము |
| 4. పునర్వసు 1, పుష్యమి 4 ఆశ్రేష 4 | = 9 పాదములు | కర్కాటకము |
| 5. మఖ 4, పుబ్బ 4, ఉత్తర 1 | = 9 పాదములు | సింహము |
| 6. ఉత్తర 3, హస్త 4, చిత్త 2 | = 9 పాదములు | కన్య |
| 7. చిత్త 2, స్వాతి 4, విశాఖ 3 | = 9 పాదములు | తుల |
| 8. విశాఖ 1, అనురాధా 4, జ్యేష్ఠ 4 | = 9 పాదములు | వృశ్చికము |
| 9. మూల 4, పూర్వాషాఢ 4, ఉత్తరాషాఢ 1 | = 9 పాదములు | ధనుస్సు |
| 10. ఉత్తరాషాఢ 3, శ్రవణం 4, ధనిష్ఠ 2 | = 9 పాదములు | మకరం |
| 11. ధనిష్ఠ 2, శతభిషం 4, పూర్వాభాద్రా 3 | = 9 పాదములు | కుంభము |
| 12 పూర్వాభాద్రా 1, ఉ-భాద్రా 4, రేవతి 4 | = 9 పాదములు | మీనము |

(16) ఈ నక్షత్రముల వలన యేర్పడు మహాదశలు వివరము.

| | | | |
|---|---|---|---|
| కృత్తిక, ఉత్తర. ఉత్తరాషాఢ | = ఈ 3 నక్షత్రములకు | రవి మహాదశ | ఆరు సంవత్సరములు |
| రోహిణి, హస్త, శ్రవణము | = ఈ 3 నక్షత్రములకు | చంద్రమహాదశ | పది సంవత్సరములు |
| మృగశిర, చిత్త, ధనిష్ఠ, | = ఈ 3 నక్షత్రములకు | కుజమహాదశ | ఏడు సంవత్సరములు |
| ఆర్ద్ర, స్వాతి, శతభిషం | = ఈ 3 నక్షత్రములకు | రాహుమహాదశ | పదునెనిమిది సంవత్సరములు |
| పునర్వసు, విశాఖ. పూర్వాభాద్ర | = ఈ 3 నక్షత్రములకు | గురుమహాదశ | పదహారు సంవత్సరములు |
| పుష్యమి, అనూరాధ, ఉ-భాద్ర | = ఈ 3 నక్షత్రములకు | శనిమహాదశ | పందొమ్మిది సంవత్సరములు |
| ఆశ్రేష, జ్యేష్ఠ, రేవతి | = ఈ 3 నక్షత్రములకు | బుధమహాదశ | పదిహేడు సంవత్సరములు |
| మఖ, మూల, అశ్విని | = ఈ 3 నక్షత్రములకు | కేతుమహాదశ | యేడు సంవత్సరములు |
| పుబ్బ, పూర్వాషాఢ, భరణి, | = ఈ 3 నక్షత్రములకు | శుక్రమహాదశ | ఇరువది సంవత్సరములు |

మహాదశలు మొత్తము 120 సంవత్సరములుగా తెలియవలసియున్నది. ఈ పై తెలిపిన నక్షత్రములలో జాతకుడు ఏనక్షత్రములో జన్మించెనో ఆ నక్షత్రము జన్మనక్షత్రము, ఆ నక్షత్రమునకు చెప్పిన దశ జననకాల మహాదశగా తెలియవలయును.

(17) భగణము = ద్వాదశరాశ్యాత్మక కాలచక్రము. ఇది రాశి భాగ లిప్త విలిప్త రూపములుగా గుణింపబడుచున్నది. అందు 60 విలిప్తలు 1 లిప్త, 60 లిప్తలు 1 భాగ, 30 భాగలు, 1 రాశి, 12 రాశులు 1 భగణము ఈ భగణము సప్తవింశతి నక్షత్రాత్మకముసు అగుచున్నది. చూడుము భగణము= 12 రాశులు మరియు 27 నక్షత్రములు నక్షత్రమునకు 4 పాదముల చొప్పున 108 పాదములు కలది అగుచున్నది.

## దివాహోరా చక్రము

(ప్రతిహోరయు సూర్యోదయము మొదలు ఒక్కొక్క గంటకాలము చొప్పున తిరిగి సూర్యోదయము వరకు జరుగుచుండును)

| వారం | 6మొ7వ | 7-8 | 8-9 | 9-10 | 10-11 | 11-12 | 12-1 | 1-2 | 2-3 | 3-4 | 4-5 | 5-6 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| సోమ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| మంగళ | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| బుధ | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| గురు | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| శుక్ర | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| శని | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |

## రాత్రిహోరా చక్రము

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| సోమ | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| మంగళ | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| బుధ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| గురు | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| శుక్ర | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| శని | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

షరా : చంద్ర శుక్ర హోరలు శుభఫలమును, బుధ కుజ హోరలు మధ్యమ ఫలమును, సూర్య శని హోరలు అధమ ఫలమును ఇచ్చును. చంద్ర గురు శుక్ర హోరలయందు రాహుకాలముగా నుండి నను కార్యానుకూలంగా నుండును. క్షీణ చంద్రుడు, పాపసహిత బుధుడు వీరు పాపులు అని తెలియవలసియున్నది.

ఇటులనే తిథి, నక్షత్ర, యోగ, కరణములు కూడా సూర్య చంద్ర గమన, స్థితి, వైషమ్యముల చేతను, చంద్రస్థితి గమనాదులచేతను, సూర్యచంద్రగతి స్థిత్యాదులచేతను, సూర్యచంద్రుల స్ఫుటరీతి చేతను యేర్పడుచున్నవి. ఇటుల పంచాంగము యేర్పడియున్నది.

**విశేషము :** సూర్యుడు ద్వాదశరాశ్యాత్మక భచక్రమును పూర్ణముగా చుట్టివచ్చుటచేత 360 దినములు 12 మాసములుగల ఒక సంవత్సరము యేర్పడుచున్నది. ఇట్టి సంవత్సరములు 4,32,000 పరిమితిగల కాలము కలియుగము, 8,64,000 సంవత్సరముల పరిమితిగల కాలము ద్వాపరయుగము 12,96,000 సంవత్సరముల పరిమితికాలము త్రేతాయుగము, 17,28,000 సంవత్సరముల పరిమితి కాలము, కృతయుగము, ఈ నాలుగుయుగముల పరిమాణకాలము మొత్తము 43,20,000 సంవత్సరములు. ఇట్టి పరిమాణముగల కాలమును మహాయుగము అని చెప్పుచున్నారు.

ఇట్టి మహాయుగములు 71 అయిన కాలమును ఒక మనువు పరిపాలించుచున్నాడు. దానిని మన్వంతరము అనుచున్నారు. ఇట్టివి 14 మన్వంతరముల కాలము సృష్టికర్తయగు బ్రహ్మదేవునకు ఒక పగలు అగుచున్నది. ఇటుల బ్రహ్మయొక్క పగటికాలము వెయ్యి మహాయుగములు (అనగా 432,00,00,000 సంవత్సరములు) ఇది ఉదయకల్పము అనియు ఇంత పరిమాణముగల రాత్రి కాలమును క్షయకల్పమనియు వ్యవహరించు చున్నారు.

1. ఉదయకల్పము అనగా ప్రపంచరచనాకాలము (పగటికాలము), 2. క్షయకల్పముఅనగా బ్రహ్మ నిద్రించుకాలము (రాత్రికాలము). ఈ రెండు కల్పములయొక్క పరిమితికాలము 864,00,00,000 సంవత్సరములు. ఇట్లు ఉదయ క్షయకల్పములు రెండును సృష్టికర్తయగు బ్రహ్మకు అహోరాత్రమగుచున్నది. అనగా బ్రహ్మకు ఒక దినము. ఇట్టి 360 దినములు బ్రహ్మకు ఒక సంవత్సరమగుచున్నది.

ఇట్టి సంవత్సరములు నూరు (శత సంవత్సరములు) బ్రహ్మకు ఆయుర్భాగ్యము కలిగియున్నది. అనాదియగు కాలమునందు ఒక సంకేతము ననుసరించి ఈ చతుర్ముఖ బ్రహ్మను 7-వ బ్రహ్మగా చెప్పుచున్నారు. శ్రీ భారతమున శాన్తిపర్వమున వేదవ్యాసులవారు వివరించినట్లు అఖిల హేయ ప్రత్యనీక కల్యాణగుణాకరుండును, అఖిల వేద వేదాన్త వేద్యుండును, అఖిల చరాచర సృష్టి, స్థితి, లయ కర్తయునగు శ్రీమన్నారాయణుని సంకల్పమువలన 1. మానసజన్మ, 2. చాక్షుషజన్మ, 3. వాచికజన్మ, 4. శ్రావణజన్మ, 5. నాసికజన్మ, 6. అండజన్మగల ఆరుగురు సృష్టి కర్తలు బ్రహ్మలు అనాదికాలంలో ఒక సంకేతకాలంనుంచి ఇప్పటికి గతించినారు.

ఇప్పుడు సప్తమ జన్మయగు (పద్మభూః) నాభికమలమున జన్మించిన చతుర్ముఖుడు సృష్టికర్తృత్వమును స్వీకరించియున్నాడు. ఈ బ్రహ్మకు ఆయుర్భాగ్యమగు నూరు సంవత్సరములలో యేబది సంవత్సరములు గడచినవి. (దీనిని పూర్వపరార్థము అనుచున్నారు). ఇప్పుడు ద్వితీయ పరార్థము ప్రారంభమైనది. అనగా 51-వ సంవత్సరము ప్రారంభమైనది. ఆ ప్రథమ సంవత్సరములో ప్రథమ మాసము, ప్రథమ పక్షము, ప్రథమ దినము జరుగుచున్నది. ఆ ప్రథమ దినములో పగటి కాలములో (ద్వితీయయామమున తృతీయ ముహూర్తమునందు) 18 ఘడియల 42 విఘడియల కాలము గతించినది.

ఈ సమయములోపల 1. స్వాయంభువ, 2. స్వారోచిష, 3. ఉత్తమ, 4. తామస, 5. రైవత, 6. చాక్షుష అను నామధేయములుగల 6 గురుమనువులు. ఒక్కొక్కరు 71 మహాయుగముల కాలము పరిపాలించి గతించినారు. ఇప్పుడు 7-వ మనువు అగు వైవస్వతమనువు పరిపాలించుచున్నాడు. ఈ వైవస్వతమనువుకు ఆయుర్భాగ్యముగా నేర్పడియున్న 71 మహాయుగముల కాలములో 28-వ మహాయుగములో కలియుగము నడచుచున్నది. 4,32,000 సంవత్సరముల పరిమాణముగల ఆ కలియుగములో ఈ క్రోధన సంవత్సరము 5086 వ సంవత్సరముగా ప్రారంభమగుచున్నది — అని కాలవిజ్ఞాన సంపన్నులగు మహాశయులు శాస్త్రీకదృక్కులై తెలుసుకొనియున్నారు. ప్రాచీనులగు మన పూర్వులు, అంతర్ముఖులై నియమ నిష్ఠాగరిష్ఠులై పరమేశ్వరోపాసన మొనరించి సర్వజ్ఞులగుటయేకాక వారివిజ్ఞానమును శాస్త్రములయందు నిక్షేపించి అర్వాచీనులగు మనపూర్వులద్వారా మనకందజేయుటచే నీ విజ్ఞానమును బడయగలుగుచున్నామని మనము సంతసించవలసి యున్నది.

**విశేషములు:** సూర్యునియొక్క స్థిరరాశులయందలి సంక్రమణమును "విష్ణుపదం" అనియును ద్విస్వభావ రాశులయందలి సంక్రమణమును "షడశీతి" అనియును,

చరరాశులై సమసప్తకములగు తులామేషరాశులయందలి సంక్రమణమును "విషువం" అనియును, చరరాశులై సమసప్తకములగు కటక మకర రాశులయందలి సంక్రమణమును "అయనం" అనియును శాస్త్రములు చెప్పుచున్నవి.

## అధికమాసాది విజ్ఞానము

చాంద్రమానమునందు యే మాసములు సూర్యుని సంక్రమణము లేకయున్నవో అనగా సౌర మాసము ప్రారంభము కానేరదో, మాసముయొక్క శుక్ల పాడ్యమి మొదలు అమావాస్య వరకు సూర్యుడున్న రాశికి చలనములేదో ఆ మాసము అధిక మాసముగా తెలియనగును.

